మీనలగ్నం, రా.12.48, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, దూర ప్రయాణాలు.
**12-06-17 సోమవారం...** తదియ, ఉత్తరాషాఢ నక్షత్రం, మీనలగ్నం, రా.12.41, గృహప్రవేశం, దూర ప్రయాణాలు.
**14-06-17 బుధవారం...** పంచమి, శ్రవణ నక్షత్రం, కర్కాటకలగ్నం, ఉ.8.13, అన్నప్రాశన, ఉపనయనం, దేవతా ప్రతిష్ట, కేశఖండన, అక్షర స్వీకారం, క్రయవిక్రయాదులు.
**14-06-17 బుధవారం...** ధనిష్ఠ నక్షత్రం, మీనలగ్నం, రా.12.31, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం.
**17-06-17 శనివారం...** అష్టమి ఉత్తరాభాద్ర నక్షత్రం, మకరలగ్నం, రా.9.25, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం.
**18-06-17 ఆదివారం...** నవమి, ఉత్తరాభాద్ర నక్షత్రం, కర్కాటకలగ్నం, ఉ.8.11, శంకుస్థాపన, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, కేశఖండన, వివాహం.
**19-06-17 సోమవారం...** దశమి, రేవతి నక్షత్రం, కర్కాటకలగ్నం, ఉ.7.54, దేవతా ప్రతిష్ఠాపన, ఉపనయనం, శంకుస్థాపన, అక్షర స్వీకారం.

## ఆషాఢమాసం

**26-06-17 సోమవారం...** శు.తదియ, పుష్యమి నక్షత్రం, కర్కాటకలగ్నం, ఉ.7.27, అన్నప్రాశన, కేశఖండన, సీమంతము, విదేశీ ప్రయాణం, క్రయవిక్రయాలు.
**28-06-17 బుధవారం...** పంచమి, మఖ నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.11.20, కేశఖండన, క్రయవిక్రయాలు, ఉయ్యాలలో వేయుట, దూర ప్రయాణాలు, కూపారంభము.
**30-06-17 శుక్రవారం...** సప్తమి, ఉత్తరా నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.11.15, అన్నప్రాశన, దూర ప్రయాణం, క్రయవిక్రయాలు.
**6-07-17 గురువారం...** త్రయోదశి, అనూరాధ నక్షత్రం, కర్కాటక లగ్నం, ఉ.6.50, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, ప్రయాణాలు.
**8-07-17 శనివారం...** పౌర్ణమి, మూలా నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.11.30, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, ప్రయాణాలు.
**10-07-17 సోమవారం...** బ.విదియ, ఉత్తరాషాఢ నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.11.23, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, ప్రయాణాలు, సీమంతం.
**12-07-17 బుధవారం...** తదియ, ధనిష్ఠ నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.11.15, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, ప్రయాణాలు, సీమంతం.
**13-07-17 గురువారం...** చవితి, శతభిష నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.11.01, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దూర ప్రయాణాలు, సీమంతం.
**16-07-17 ఆదివారం...** సప్తమి రేవతి నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.గం. 10.55 ని.లకు అన్నప్రాశన, క్రయవిక్రయాలు, ప్రయాణాలు, సీమంతం.

## శ్రావణమాసం

**26-07-17 బుధవారం...** శు.తదియ, పుబ్బ నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.గం.10.24 ని.లకు, క్రయవిక్రయాలు, వ్యాపార డోలారోహణం, సీమంతం.
**27-07-2017 గురువారం...** పంచమి, ఉత్తరా నక్షత్రం, మీనలగ్నం, రాత్రి గం.9.48 ని. వివాహం, గర్భాదానం, గృహప్రవేశం, విదేశీ ప్రయాణం.
**28-07-17 శుక్రవారం...** షష్టి, హస్త నక్షత్రం, మీనలగ్నం,రా.9.42, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, విదేశీయానం.
**29-7-17 శనివారం...** సప్తమి, చిత్త నక్షత్రం, మిథునలగ్నం, తె.4.23, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, విదేశీయానం.
**02-8-2017 బుధవారం...** దశమి, అనూరాధ నక్షత్రం, కన్యాలగ్నం, రాత్రి 9.52, వివాహం, ఉపనయనం, దేవతా ప్రతిష్ఠ, దూర ప్రయాణం.
**03-8-2017 గురువారం...** ఏకాదశి, మూలా నక్షత్రం, మీనలగ్నం, రా.9.15, వివాహం, గర్భాదానం, గృహప్రవేశం, విదేశీ ప్రయాణం.
**06-8-2017 ఆదివారం...** చతుర్దశి, ఉత్తరాషాఢ నక్షత్రం, మీనలగ్నం, రాత్రి 9.02 ని., వివాహం, గర్భాదానం, గృహప్రవేశం, విదేశీ ప్రయాణం.
**09-8-2017 బుధవారం...** బ.విదియ, శతభిష నక్షత్రం, మీనలగ్నం, రా.8.54, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం.
**11-8-2017 శుక్రవారం...** చవితి, ఉత్తరాభాద్ర నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.9.18, దేవతా ప్రతిష్ఠాపన, వివాహం, గృహప్రవేశం, వ్యాపారాదులు.
**12-8-2017 శనివారం...** పంచమి, రేవతి నక్షత్రం, కన్యాలగ్నం, ఉ.9.14, దేవతా ప్రతిష్ఠాపన, వివాహం, గృహప్రవేశం, వ్యాపారాదులు.
**13-8-2017 ఆదివారం...** సప్తమి, అశ్విని నక్షత్రం, మీనలగ్నం, రా.8.38, వివాహం, గృహప్రవేశం.
**16-8-2017 బుధవారం...** నవమి, రోహిణి నక్షత్రం, మీనలగ్నం, రాత్రి గం.8.21ని. వివాహం, గర్భాదానం, గృహప్రవేశం.
**17-8-2017 గురువారం...** దశమి, మృగశిరా నక్షత్రం, మీనలగ్నం, రాత్రి గం.8.15ని. వివాహం, గర్భాదానం, గృహప్రవేశం.

## భాద్రపదమాసం

**24-8-2017 గురువారం...** శు.తదియ, ఉత్తరా నక్షత్రం, తులాలగ్నం, ఉ.11.15, క్రయవిక్రయాలు, డోలారోహణం, సీమంతం.
**25-8-2017 శుక్రవారం...** చవితి, హస్త నక్షత్రం, తులాలగ్నం, ఉ.11.12, క్రయ విక్రయాలు, డోలారోహణం, సీమంతం.
**26-8-2017 శనివారం...** పంచమి, చిత్త నక్షత్రం, తులాలగ్నం, ఉ.11.08, క్రయ విక్రయాలు, డోలారోహణం, సీమంతం.
**31-8-2017 గురువారం...** దశమి, మూలా నక్షత్రం, తులాలగ్నం, ఉ.11.00, క్రయ విక్రయాలు, డోలారోహణం, సీమంతం.
**03-9-2017 ఆదివారం...** త్రయోదశి, శ్రవణ నక్షత్రం, తులాలగ్నం, ఉ.10.38, క్రయ విక్రయాలు, డోలారోహణం, సీమంతం.
**04-9-2017 సోమవారం...** త్రయోదశి, శ్రవణా నక్షత్రం, తులాలగ్నం, ఉ.10.34, క్రయ విక్రయాలు, డోలారోహణం, సీమంతం, అన్నప్రాశన.
**06-9-2017 బుధవారం...** పౌర్ణమి, శతభిష నక్షత్రం, తులాలగ్నం, ఉ.10.26, క్రయ విక్రయాలు, డోలారోహణం, సీమంతం, అన్నప్రాశన.
**07-9-2017 గురువారం...** బ.విదియ, ఉత్తరాభాద్ర నక్షత్రం, తులాలగ్నం, ఉ.9.27, వ్యవహారం, ప్రయాణం.
**08-9-2017 శుక్రవారం...** విదియ, ఉత్తరాభాద్ర నక్షత్రం, తులాలగ్నం, ఉ.10.18, అన్నప్రాశన, సీమంతం, దూర ప్రయాణాలు.
**09-9-2017 శనివారం...** చవితి, రేవతి నక్షత్రం, తులాలగ్నం, ఉ.10.14, డోలారోహణం, సీమంతం, దూర ప్రయాణాలు.
**10-9-2017 ఆదివారం...** చవితి, అశ్విని నక్షత్రం, తులాలగ్నం, ఉ.10.10, డోలారోహణం, సీమంతం, దూర ప్రయాణాలు.
**15-9-2017 శుక్రవారం...** దశమి, పునర్వసు నక్షత్రం, తులాలగ్నం, ఉ.9.47, డోలారోహణం, సీమంతం, దూర ప్రయాణాలు.
**16-9-2017 శనివారం...** ఏకాదశి, పుష్యమి నక్షత్రం, తులాలగ్నం, ఉ.9.47, డోలారోహణం, సీమంతం, ప్రయాణాలు.
**18-9-2017 సోమవారం...** త్రయోదశి, మఖ నక్షత్రం, తులాలగ్నం, ఉ.9.42, డోలా రోహణం, సీమంతం, ప్రయాణాలు, క్రయవిక్రయాలు.

## ఆశ్వయుజ మాసం

**21-9-2017 గురువారం...** పాడ్యమి, హస్త నక్షత్రం, తులాలగ్నం, ఉ.9.30, కలశ స్థాపన, దేవీ పూజలు ప్రారంభం.

**22-9-2017 శుక్రవారం...** తదియ, చిత్త నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.11.28, క్రయ విక్రయాలు, వ్యాపారం.
**23-9-2017 శనివారం...** చవితి, స్వాతి నక్షత్రం, ధనుర్లగ్నం, మ.1.24, క్రయవిక్రయాలు, వ్యాపారం.
**25-9-2017 సోమవారం...** పంచమి, అనూరాధ నక్షత్రం, ధనుర్లగ్నం, మ.1.15, క్రయ విక్రయాలు, వ్యాపారం.
**27-09-2017 బుధవారం...** సప్తమి, మూలా నక్షత్రం, ధనుర్లగ్నం, మ.1.08, సరస్వతీ పూజ, క్రయవిక్రయాలు, వ్యాపారం.
**29-09-2017 శుక్రవారం...** నవమి, పూర్వాషాఢ నక్షత్రం, తులాలగ్నం, ఉ.8.57, దేవీ పూజలు, హోమాలు.
**30-09-2017 శనివారం...** దశమి, ఉత్తరాషాఢ నక్షత్రం, తులాలగ్నం, ఉ.8.49, వ్యాపార ప్రారంభం.
**01-10-17 ఆదివారం...** ఏకాదశి, శ్రవణం నక్షత్రం, తులాలగ్నం, ఉ.8.44, గృహారంభం, వివాహం, ఉపనయనం.
**02-10-17 సోమవారం...** ద్వాదశి, శతభిష నక్షత్రం, మిథునలగ్నం, రా.12.06, గృహప్రవేశం.
**04-10-17 బుధవారం...** చతుర్దశి, ఉత్తరాభాద్ర నక్షత్రం, మిథునలగ్నం, రా.11.54, వివాహం, గృహప్రవేశం.
**05-10-17 గురువారం...** పౌర్ణమి, ఉత్తరాభాద్ర నక్షత్రం, తులాలగ్నం, ఉ.8.31, శంకుస్థాపన, ఉపనయనం, వివాహం
**గురువారం**, పౌర్ణమి, ఉత్తరాభాద్ర నక్షత్రం, మిథునలగ్నం, రా.11.54, వివాహం, గృహప్రవేశం.
**06-10-17 శుక్రవారం...** బ.పాడ్యమి, రేవతి నక్షత్రం, తులాలగ్నం, ఉ.8.23, వివాహం, శంకుస్థాపన, దేవతా ప్రతిష్ఠ.
**07-10-17 శనివారం...** విదియ, అశ్విని నక్షత్రం, ధనుర్లగ్నం, మ.12.29, క్రయ విక్రయాలు, వ్యాపారం, ప్రయాణాలు.
**09-10-17 సోమవారం...** పంచమి, రోహిణి నక్షత్రం, మిథునలగ్నం, రా. 11.38, గృహప్రవేశం, విదేశీయానం.
**10-10-2017 నుండి 11-11-2017 వరకు గురుమౌఢ్యమి**

## కార్తీక మాసం

**23-10-17 సోమవారం...** శు. చవితి, అనూరాధ నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.11.22, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం.
**25-10-17 బుధవారం...** షష్ఠి మూలా నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.11.18, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం.
**30-10-17 సోమవారం...** దశమి, శతభిష నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.11.01, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం.
**02-11-17 గురువారం...** త్రయోదశి, రేవతి నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.10.50, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం.
**03-11-17 శుక్రవారం...** చతుర్దశి, అశ్వని నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.10.46, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం, వ్యవసాయం.
**06-11-17 సోమవారం...** బ.విదియ, రోహిణి నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.10.31, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం, వ్యవసాయం.
**09-11-17 గురువారం...** షష్ఠి, పునర్వసు నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.10.18, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం, వ్యవసాయం, ప్రయాణాలు.
**10-11-17 శుక్రవారం...** సప్తమి, పుష్యమి నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.10.14, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం, వ్యవసాయం, ప్రయాణాలు.
**15-11-17 బుధవారం...** ద్వాదశి, హస్త నక్షత్రం, ధనుర్లగ్నం, ఉ.9.54, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారం, వ్యవసాయం, ప్రయాణాలు.

## మార్గశిర మాసం

**23-11-17 గురువారం...** శు.పంచమి, ఉత్తరాషాఢ నక్షత్రం, శుభసమయం, ఉ.10.57, అన్న ప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**24-11-17 శుక్రవారం...** షష్ఠి, శ్రవణ నక్షత్రం, శుభసమయం, ఉ.10.51, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**25-11-17 శనివారం...** సప్తమి, ధనిష్ఠ నక్షత్రం, శుభసమయం, ఉ.10.47, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**26-11-17 ఆదివారం...** అష్టమి, ధనిష్ఠ నక్షత్రం, శుభసమయం, ఉ.10.43, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**27-11-17 సోమవారం...** నవమి, శతభిష నక్షత్రం, శుభసమయం, ఉ.10.39, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**30-11-17 గురువారం...** ద్వాదశి, రేవతి నక్షత్రం, శుభసమయం, ఉ.10.35, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**1-12-17 నుండి 16-02-2018** శుక్రమౌఢ్యమి
**1-12-17 శుక్రవారం...** త్రయోదశి, అశ్విని నక్షత్రం, శుభసమయం ఉ.10.31, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**3-12-17 ఆదివారం...** పౌర్ణమి, రోహిణి నక్షత్రం, శుభసమయం ఉ.10.19, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**4-12-17 సోమవారం...** బ.పాడ్యమి, మృగశిర నక్షత్రం, శుభసమయం ఉ.10.15, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**6-12-17 బుధవారం...** తదియ, పునర్వసు నక్షత్రం, శుభసమయం ఉ.10.11, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**7-12-17 గురువారం...** చవితి, పుష్యమి నక్షత్రం, శుభసమయం ఉ.10.06, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**9-12-17 శనివారం...** సప్తమి, మఖ నక్షత్రం, శుభసమయం ఉ.9.58, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**11-12-17 సోమవారం...** నవమి, ఉత్తరా నక్షత్రం, శుభసమయం ఉ.9.50, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**13-12-17 బుధవారం...** ఏకాదశి, చిత్త నక్షత్రం, శుభసమయం ఉ.9.46, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.
**14-12-17 గురువారం...** ద్వాదశి, స్వాతి నక్షత్రం, శుభసమయం ఉ.9.46, అన్నప్రాశన, కేశఖండన, వ్యాపారాలు, ప్రయాణాలు.

## పుష్యమాసం

**21-12-17 గురువారం...** శు.తదియ, ఉత్తరాషాఢ నక్షత్రం, శుభసమయం, ఉ.11.25, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
**22-12-17 శుక్రవారం...** చవితి, శ్రవణ నక్షత్రం, శుభసమయం, ఉ.11.21, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
**23-12-17 శనివారం...** పంచమి, ధనిష్ఠ నక్షత్రం, శుభసమయం, ఉ.11.17, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
**24-12-17 ఆదివారం...** షష్ఠి, శతభిష నక్షత్రం, శుభసమయం, ఉ.11.13, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
**27-12-17 బుధవారం...** నవమి, రేవతి నక్షత్రం, శుభసమయం, ఉ.11.01, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
**28-12-17 గురువారం...** దశమి, అశ్విని నక్షత్రం, శుభసమయం, ఉ.10.58, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.

31-12-17 ఆదివారం... త్రయోదశి, రోహిణి నక్షత్రం, శుభసమయం, ఉ.10.41, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.

## 2018

01-1-2018 సోమవారం... చతుర్దశి, మృగశిర నక్షత్రం, శుభసమయం, ఉ.10.41, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
03-1-2018 బుధవారం... బ.విదియ, పునర్వసు నక్షత్రం, శుభసమయం, ఉ.10.34, అన్న ప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
05-1-2018 శుక్రవారం... చవితి, పుష్యమి నక్షత్రం, శుభసమయం, ఉ.10.26, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
07-1-2018 ఆదివారం... షష్ఠి, ఉత్తరా నక్షత్రం, శుభసమయం, ఉ.10.18, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
08-1-2018 సోమవారం... సప్తమి, హస్త నక్షత్రం, శుభసమయం, ఉ.10.14, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
10-1-2018 బుధవారం... నవమి, స్వాతి నక్షత్రం, శుభసమయం, ఉ.10.04, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
13-1-2018 శనివారం... ద్వాదశి, స్వాతి నక్షత్రం, శుభసమయం, ఉ.9.52, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.

## మాఘమాసం

19-1-2018 శుక్రవారం... శు.విదియ, ధనిష్ఠ నక్షత్రం, శుభసమయం, ఉ.9.31, అన్నప్రాశన, సీమంతం, వ్యాపారం, ప్రయాణం.
20-1-2018 శనివారం... చవితి, శతభిషం నక్షత్రం, శుభసమయం, ఉ.9.22, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
22-1-2018 సోమవారం... పంచమి, ఉత్తరాభాద్ర నక్షత్రం, శుభసమయం, ఉ.9.19, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
24-1-2018 బుధవారం... సప్తమి, అశ్వని నక్షత్రం, శుభసమయం, ఉ.9.11, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
27-1-2018 శనివారం... ఏకాదశి, రోహిణి నక్షత్రం, శుభసమయం, ఉ.9.01, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
28-1-2018 ఆదివారం... ద్వాదశి, మృగశిర నక్షత్రం, శుభసమయం, ఉ.8.56, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
31-1-2018 బుధవారం... పౌర్ణమి, పుష్యమి నక్షత్రం, శుభసమయం, ఉ.8.43, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
2-2-2018 శుక్రవారం... బ.విదియ, మఖ నక్షత్రం, శుభసమయం, ఉ.8.35, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
4-2-2018 ఆదివారం... చవితి, ఉత్తర నక్షత్రం, శుభసమయం, ఉ.8.27, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
5-2-2018 సోమవారం... పంచమి, హస్త నక్షత్రం, శుభసమయం, ఉ.8.23, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
7-2-2018 బుధవారం... సప్తమి, స్వాతి నక్షత్రం, శుభసమయం, ఉ.8.14, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
9-2-2018 శుక్రవారం... నవమి, అనూరాధ నక్షత్రం, శుభసమయం, ఉ.8.10, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.
11-2-2018 ఆదివారం... ఏకాదశి, మూలా నక్షత్రం, శుభసమయం, ఉ.8.06, అన్నప్రాశన, వ్యాపారం, సీమంతం, డోలారోహణం.

## ఫాల్గుణమాసం

19-2-2018 సోమవారం... శు.చవితి, రేవతి నక్షత్రం, తులాలగ్నం, రా. 11.26, గృహప్రవేశం, దూర ప్రయాణాలు.
21-2-2018 బుధవారం... షష్ఠి, అశ్విని నక్షత్రం, మీనలగ్నం, ఉ 8.05, శంకుస్థాపన, ఉపనయనం, వివాహం, ప్రతిష్ఠలు.
24-2-2018 శనివారం... నవమి, రోహిణి నక్షత్రం, మీనలగ్నం, ఉ 7.49, శంకుస్థాపన, ఉపయనం, వ్యాపారం, వివాహం, ప్రయాణాలు.
26-2-2018 సోమవారం... ఏకాదశి, పునర్వసు నక్షత్రం, మీనలగ్నం, ఉ. 7.41, శంకుస్థాపన, ఉపనయనం, వ్యాపారం, అక్షర స్వీకారం, నూతన వస్త్రాలు.
1-3-2018 గురువారం... చతుర్దశి, మఖ నక్షత్రం, మీనలగ్నం, ఉ 7.35, వివాహం, ఉపనయనం, నూతన వస్త్రాలు.
4-3-2018 ఆదివారం... బ.తదియ, చిత్త నక్షత్రం, తులాలగ్నం, రా 10.42, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, ప్రయాణాలు.
8-3-2018 గురువారం... సప్తమి, అనూరాధ నక్షత్రం, తులాలగ్నం, రా.10.28, వివాహం, గృహప్రవేశం, దూరప్రయాణాలు, గర్భాదానం.
10-3-2018 శనివారం... నవమి, మూలా నక్షత్రం, తులాలగ్నం, రా 10.20, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, ప్రయాణాలు.
12-3-2018 సోమవారం... దశమి, ఉత్తరాషాఢ నక్షత్రం, మేషలగ్నం, ఉ.9-14, శంకుస్థాపన, ఉపయనం.

## తెలుసుకోవలసిన విషయాలు

- సువాసన లేనివి, ముందు రోజే కోసినవి, పురుగు తొలిచినవి, వాడినవి పూర్తిగా విచ్చనివి అయిన పూలు పూజకు పనికి రావు.
- లక్ష్మీతామర పూలు సర్వదేవతా పూజకు శ్రేష్ఠం.
- తెల్లని పూలతో పూజించడం వలన మనః శాంతి కలుగుతుంది.
- బ్రహ్మచారి, సన్యాసి, పూర్వ సువాసిని తాంబూల చర్వణం చేయరాదు.
- ఆసనాలలో సర్వశ్రేష్ఠమైనది దర్భాసనం.
- బియ్యం పిండితోనే ముగ్గ వేయాలి. (రాతి ముగ్గ వాడరాదు.)
- అగరవత్తులు వెలిగించి దేవుడి చుట్టూ తిప్పకూడదు. ధూపం మాత్రం చేతితో చూపించాలి.
- ప్రదక్షిణ చాలా నిదానంగా అడుగులో అడుగు వేస్తూ చేయాలి.
- రావణుని నివాసమైన లంక – త్రికూట పర్వతం మీద వుంది.
- రావణబ్రహ్మ అసలు పేరు పౌలస్త్య బ్రహ్మ
- శివుడి త్రిశూలం పేరు – విజయం; ధనుస్సు – పినాకం.
- శివుడికి ఇష్టమైన వాద్యములలో ముఖ్యమైనది మృదంగం.
- వ్యాకరణం – శివప్రసాదం.
- వ్యాఘ్రపాద మహర్షి, పతంజలి మహర్షి కోరికపై శివుడు ఉమా సమేతంగా ఆనందతాండవం చేసిన చోటు చిదంబర మహా పుణ్యక్షేత్రం. అందుకే అక్కడ నటరాజ స్వామికి నిత్య పూజలు జరుగుతున్నాయి. దీనినే శివ నాట్య సభ అని కూడా అంటారు.
- పార్వతీ అమ్మవారి ముఖ్య పరిచారికల పేర్లు జయ, విజయ.
- పార్వతీదేవి మరో పేరు అపరాజిత. (ఓటమి లేనిది అని అర్థం.)
- అయ్యప్పస్వామి వారు కూర్చునే ఆసన భంగిమ – సుఖాసనము.
- శ్రీ కృష్ణపరమాత్మకు నీడనిచ్చినది – కదంబ వృక్షము.
- భీష్ముడి అసలు పేరు – దేవవ్రతుడు.
- భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు కనుక భీష్ముడన్నారు.
- బ్రహ్మ, విష్ణువులకు జ్ఞాన బోధ చేయడానికి పరమేశ్వరుడు అగ్నిస్తంభంగా అవతరించిన ప్రదేశమే అరుణాచలం.
- వాల్మీకి మహర్షి పూర్వనామం రత్నాకరుడు.
- చిత్తవృత్తులను నిరోధించడమే యోగము.
- వేద విహిత కర్మాచరణమే ధర్మము.

# శ్రీ హేవిళంబినామ సంవత్సర పండుగలు

**మార్చి-2017**

28 శ్రీ హేవిళంబినామ సంవత్సర ఉగాది
30 శుక్రమౌఢ్యమి త్యాగం
31 రేవతి కార్తె

**ఏప్రిల్ -2017**

1. లక్ష్మీ పంచమి
4. స్మార్త శ్రీరామనవమి
5. వైష్ణవ శ్రీరామనవమి
7. కామదా ఏకాదశి
8. శని త్రయోదశి
9. మహావీర్ జయంతి
10. హనుమద్విజయోత్సవము
13. అశ్వని కార్తె
14. అంబేద్కర్ జయంతి, సంకష్టహర చతుర్థి, గుడ్‌ఫ్రైడే
16. ఈస్టర్ సండే
25. మాసశివరాత్రి
27. వైశాఖ స్నానారంభం, భరణి కార్తె
28. బలరామ జయంతి, అక్షయ తృతీయ, షాలాన్ నెల ప్రారంభం
30. శ్రీ శంకరాచార్య జయంతి

**మే-2017**

1. కార్మిక దినోత్సవము
2. గంగాసప్తమి
4. వాస్తుకర్తరీ ప్రారంభం
6. మోహిని ఏకాదశి
9. నరసింహ జయంతి, బుద్ధ పూర్ణిమ
10. అన్నమాచార్య జయంతి
11. అగ్నికర్తరీ ప్రారంభం, కృత్తిక కార్తె
14. సంకష్టహర చతుర్థి
21. హనుమజ్జయంతి
22. అపర ఏకాదశి
24. మాసశివరాత్రి
25. రోహిణి కార్తె, శని జయంతి
28. రంజాన్ నెల ప్రారంభం
28. వాస్తుకర్తరీ త్యాగం

**జూన్ -2017**

5. నిర్జల ఏకాదశి, శ్రీ ఆదిశంకరుల కైలాస గమనము
8. మృగశిర కార్తె
9. ఏరువాక పౌర్ణమి
13. సంకష్టహర చతుర్థి
15. మిథున సంక్రమణ
21. కూర్మజయంతి, ఆరుద్ర కార్తె
22. మాసశివరాత్రి
23. వటసావిత్రీ వ్రతం
26. రంజాన్
28. స్కందపంచమి
30. భానుసప్తమి

**జులై - 2017**

4. తొలిఏకాదశి, చాతుర్మాస్య వ్రతారంభం
5. పునర్వసు కార్తె
8. డాక్టర్ వై.యస్. రాజశేఖరరెడ్డి జయంతి
9. గురుపౌర్ణమి
12. సంకష్టహర చతుర్థి
16. దక్షిణాయన పుణ్యకాలం ప్రారంభం
19. ఆదికృత్తిక, కామిక ఏకాదశి
20. వైష్ణవానాం ఏకాదశి
22. మాసశివరాత్రి
23. చుక్కల అమావాస్య
27. గరుడపంచమి
29. సూర్యషష్ఠి
30. భాను సప్తమి

**ఆగష్టు-2017**

2. ఆశ్లేష కార్తె
3. పుత్రైకాదశి
4. వరలక్ష్మీ వ్రతం, దామోదర ద్వాదశి
5. శనిత్రయోదశి
6. వరాహ జయంతి
7. రాఖీపండుగ, జంధ్యాల పౌర్ణమి, చంద్రగ్రహణం
11. సంకష్టహర చతుర్థి
14. కృష్ణాష్టమి
15. స్వాతంత్ర్య దినోత్సవం
19. శనిత్రయోదశి
20. మాసశివరాత్రి
21. పోలాల అమావాస్య, సూర్యగ్రహణం
24. బలరామ జయంతి
25. వినాయక చవితి
26. ఋషిపంచమి

**సెప్టెంబరు -2017**

2. పరివర్తన ఏకాదశి, బక్రీద్, వై.యస్. రాజశేఖరరెడ్డి వర్ధంతి
3. వామన జయంతి
4. ఓనం
5. అనంతపద్మనాభ వ్రతం, టీచర్స్ డే
6. మహాలయాపక్షారంభం ఉమామహేశ్వర వ్రతం,
8. ఉండ్రాళ్ళతద్దె
9. సంకష్టహర చతుర్థి
10. భరణ మహాలయం
12. కావేరీ పుష్కరాలు
13. ఉత్తర కార్తె
16. ఇందిరైకాదశి
18. మాసశివరాత్రి
19. మహాలయ అమావాస్య
20. బతుకమ్మ పండుగ
21. శరన్నవరాత్రులు ప్రారంభం
22. ప్రీతి విదియ
25. ఉపాంగ లలితాగౌరీ వ్రతం
28. దుర్గాష్టమి, సరస్వతీపూజ
29. మహర్నవమి, సువాసినీపూజ
30. విజయదశమి, దసరా, శమీపూజ

**అక్టోబరు-2017**

1. పాశాంకుశ ఏకాదశి
2. గాంధీ జయంతి
5. వాల్మీకి జయంతి
8. అట్లతద్దె, సంకష్టహర చతుర్థి
10. చిత్త కార్తె
12. గురుమౌఢ్యమి ప్రారంభం
15. రమ్య ఏకాదశి
17. ధనత్రయోదశి
18. నరకచతుర్దశి, మాస శివరాత్రి
19. ధనలక్ష్మీ పూజ, దీపావళి
20. ఆకాశదీప ప్రారంభం, కార్తీక ప్రారంభం
21. భగినీ హస్త భోజనం
22. త్రిలోచన గౌరీవ్రతం
23. నాగులచవితి, స్వాతి కార్తె
24. నాగపంచమి
27. యాజ్ఞవల్క్య జయంతి
31. భీష్మ ఏకాదశి, చాతుర్మాస్య వ్రతం సమాప్తి

**నవంబరు -2017**

1. చిలుకు ద్వాదశి
3. కార్తిక పౌర్ణమి
6. విశాఖ కార్తె
7. సంకష్టహర చతుర్థి
9. గురుమౌఢ్యమి అంత్యం
10. కాలాష్టమి
14. ఉత్పత్తైకాదశి
16. మాసశివరాత్రి, గోవత్స ద్వాదశి
19. అనూరాధ కార్తె
24. సుబ్రహ్మణ్య షష్ఠి
26. భానుసప్తమి
27. కాలభైరవాష్టమి
28. శుక్రమౌఢ్యమి ప్రారంభం
30. మోక్షైకాదశి, గీతాజయంతి

**డిసెంబరు - 2017**

1. మిలాద్ ఉన్ నబి, మత్స్య ద్వాదశి, హనుమాన్ వ్రతం
2. జ్యేష్ఠ కార్తె
3. దత్తాత్రేయ జయంతి
5. పరశురామ జయంతి
6. సంకష్టహర చతుర్థి
9. త్రిసోష్టకాలు
10. కాలభైరవాష్టమి
11. ధనుర్మాసారంభం
13 సఫలైకాదశి
15. మూల కార్తె
16. మాసశివరాత్రి, శని త్రయోదశి
21 సావిత్రీ గౌరీవ్రతం
25. క్రిస్టమస్
26. రుద్రాష్టమి
28. పూర్వాషాఢ కర్తె
29. వైకుంఠ ఏకాదశి
30. కూర్మ ద్వాదశి, శనిత్రయోదశి

**జనవరి-2018**

1. ఆంగ్ల సంవత్సరాది
4. సంకష్టహర చతుర్థి
5. శ్రీ త్యాగరాజస్వామి ఆరాధన
8. స్వామి వివేకానంద జయంతి
11. ఉత్తరాషాఢకార్తె
12. షట్ తిలైకాదశి
13. భోగి పండుగ
14. సంక్రాంతి, మకర సంక్రమణం, ఉత్తరాయణం ప్రారంభం
15. కనుమ, మాసశివరాత్రి
16. ముక్కనుమ, చొల్లంగి అమావాస్య, పురందరదాసు పుణ్యదినం
18. మాఘస్నానారంభం
21. తిల చతుర్దశి
22. శ్రీపంచమి
24. రథసప్తమి, శ్రవణకార్తె
25. భీష్మాష్టమి
26. రిపబ్లిక్ దినోత్సవము
27. భీష్మ ఏకాదశి, భీష్మ ద్వాదశి కామధైకాదశి
31. సంపూర్ణ చంద్రగ్రహణం

**ఫిబ్రవరి-2018**

1. సంకష్టహర చతుర్థి
10. శుక్రమౌఢ్యమి త్యాగము
11. విజయ ఏకాదశి
14. మహాశివరాత్రి
17. రామకృష్ణ జయంతి
19. పుత్రగణపతి వ్రతం
26. అమలైకాదశి
27. నృసింహ ద్వాదశి

**మార్చి-2018**

1. హోళీ
2. వసంతోత్సవము
5. సంకష్టహర చతుర్థి
13. పాపమోచన ఏకాదశి
15. మాసశివరాత్రి
18. విళంబినామ సంవత్సర ఉగాది

# నవగ్రహ సంచార భాష్యాలు 2017-2018 జరుగబోవు సంఘటనలు - సామాజిక విషయాలు

- మామిడికాయలకు చేదుకాలం.
- పాకిస్థాన్ వంకరబుద్ధి మారదు – శత్రుత్వం తారస్థాయికి చేరుతుంది.
- చైనా వంకరబుద్ధి – పాకిస్థాన్‌ను దాటిపోతుంది.
- దక్షిణ చైనా సముద్ర వివాదాలు అన్ని హద్దులను దాటిపోతాయి.
- చైనాపై సర్వత్రా విమర్శలు.
- క్రికెట్‌లో కుళ్ళు రాజకీయాలకు తెరపడుతుంది.
- తెలుగు చలనచిత్రసీమలో చిన్న సినిమాలకు ఆదరణ
- కోల్‌కతాలో ప్రకృతి బీభత్సం.
- ఆంధ్రప్రదేశ్‌లో, కర్ణాటకలో కరువుకాటకాలు సంభవిస్తాయి.
- హిమాలయ పర్వత ప్రాంతానికి, సమీప ప్రాంత దేశాలకు ఉత్తర భారతదేశానికి భూకంపం.
- సెల్ఫీ పిచ్చి కొంపదీస్తుంది
- సైనా నెహ్వాల్ రాణిస్తుంది.
- ఆర్మీ దుస్తులలో ఉగ్రవాదుల హల్‌చల్.
- పెంచి పోషించిన ఉగ్రవాదమే పాకిస్థాన్‌కు పెనుముప్పు అవుతుంది.
- పెళ్ళిగాని మగపిల్లల సంఖ్య పెరుగుతుంది.
- బియ్యం ధర పెరుగుతుంది.
- ఈ సంవత్సరం కూడా ఇండోనేషియా, సుమత్రా దీవులకు ప్రతికూల కాలం.
- చమురు కంపెనీల దివాలా.
- ప్రవాసభారతీయులకు అష్టకష్టాలు.
- ఆకాశ ప్రమాదంలో ఓ ప్రముఖుని మృతి.
- ప్రేమపెళ్ళిళ్ళు – ఆత్మహత్యలు – అనుమానాస్పద మృతులు ఎక్కువవుతాయి.
- క్రీడాకారుల భద్రతలో అపశృతి సంభవించే అవకాశం ఉంది.
- గోధుమలు, పంచదార రేట్లు పెరుగుతాయి.
- రొయ్యలు, చేపల చెరువుల వ్యాపారం బాగుంటుంది.
- పూజాసామాగ్రి ధరలు, ఆవునెయ్యి, నెయ్యి ధరలు పెరుగుతాయి.
- నిషేధిత గుట్కా వ్యాపారం మూడు పూలు – ఆరుకాయలు.
- ఎడారి రాజ్యాలకు ప్రతికూల కాలం.
- క్రికెట్‌తో పాటు ఇతర క్రీడలకు ప్రోత్సాహం లభిస్తుంది.
- బి.సి.సి.ఐకి గడ్డుకాలం.
- బి.జె.పిలో తిరిగి రాజకీయ కేంద్ర బిందువుగా ఎల్.కె.అద్వానీ
- కీలకమైన ఉగ్రవాదులు హైదరాబాద్ లో పట్టుబడతారు – ఒక పెద్ద అపశృతి తప్పుతుంది.
- నూనెల ధరలు బాగా పెరుగుతాయి.
- ఉత్తర భారతదేశంలో భూకంపాలు.
- దేశద్రోహుల రహస్యాలు బైట పడతాయి.
- హైదరాబాద్‌కు పెట్టుబడులు – నూతన కంపెనీలు.
- జ్యోతిరాదిత్య సింధియాకి రాజయోగం.
- కంబోడియా, దావోస్, థాయ్‌లాండ్, మొజాంబిక్, న్యూజీలాండ్, జింబాబ్వే, ఆస్ట్రేలియా, ఫోర్ట్ మెక్ ముర్రె (కెనడా ప్రాంతం) బ్రెజిల్, ఆఫ్రికా ఖండానికి తీవ్ర అరిష్టకాలం.
- స్టేషనరీ, ప్రింటింగ్ పుస్తకాలు, ఇంటికి వేసేరంగులు వీటి ధర ఎక్కువగా ఉంటుంది.
- ఇసుక మాఫియా దందాలు మరింత ఎక్కువవుతాయి.
- వైఎస్‌ఆర్‌సీపీకి విశేష జనాదరణ.
- ఎన్నడూ లేని విధంగా ఆంధ్రప్రదేశ్ ఆర్థికపరిస్థితి దిగజారుతుంది.
- ఆహార ధాన్యాల ధర పెరుగుతుంది.
- పత్తి బంగారం అవుతుంది. (పండించిన రైతులకు).
- భాగ్యనగరానికి మళ్ళీ వైభోగం.
- హోమియోపతి వైద్యానికి జనాదరణ.
- దేశద్రోహులు – నమ్మకద్రోహులు ఈ సంవత్సరం పట్టుబడ్తారు.
- పాకిస్థాన్ రక్షణవ్యవస్థ, రహస్యాలను ఉగ్రవాదులు చేజిక్కించుకుంటారు.
- ఐటి రంగానికి ఒడిదుడుకులు.
- టాటా మోటార్స్‌కు గడ్డుకాలం.
- ప్రజలకు నచ్చని స్వచ్ఛభారత్.
- పాకిస్థాన్‌తో, చైనాతో సంబంధ బాంధవ్యాలు తెగతెంపులు.
- ప్రత్యేక హోదా విషయం ప్రాధాన్యతను సంతరించుకుంటుంది.
- విరాట్ కోహ్లీకి మంచి జోరు.
- పసుపు ధర కలిగి ఉంటుంది.
- పేదలకు కిరోసిన్ అందుబాటులో ఉండదు.
- కిరోసిన్‌ను డీజిల్‌గా మార్చే పక్రియను మన వాళ్ళు కనుగొంటారు.
- మన్మోహన్‌సింగ్ జాతకం బాగాలేదు.
- దేశ ఆర్థికస్థితి దివాలా తీస్తుంది.
- మన దేశ రహస్యాలు చేరకూడని వారికి చేరుతాయి.
- క్రికెట్‌లో ఇంగ్లాండ్ టీమ్ కొద్దికొద్దిగా బలం పుంజుకుంటుంది.
- ఉల్లిధర తగ్గి, మళ్లీ పెరుగుతుంది.
- ఫిలిప్పీన్స్‌లో ఆగని అరాచకం
- క్రైమ్ రేటు పెరుగుతుంది.
- కేజ్రీవాల్‌కు మిశ్రమఫలితాలు.
- సైబర్‌నేరాలు అధికమవుతాయి.
- రాష్ట్రంలోనూ, హైదరాబాద్‌లోనూ పెరగనున్న గన్ కల్చర్.
- కొలీజియం వ్యవస్థపై విమర్శలు.
- చైనా అధినేత జంపింగ్ వక్ర వ్యాఖ్యలు
- ఉత్తరకొరియా అధ్యక్షుడి వల్ల ప్రపంచ శాంతికి విఘాతం.
- సజ్జలు, జొన్నలు, రాగులు, ఉలవలు మంచి ధర కలిగి ఉంటాయి.
- సాఫ్ట్‌వేర్ రంగానికి గడ్డుకాలం.
- పెసరపప్పుకు మద్దతు ధర రాదు.
- సిరియాలో ఆగని విధ్వంసాలు.
- మిర్చి రైతులకు అగ్నిపరీక్షా కాలం.
- అమెరికాకు ప్రతికూల కాలం, ఆర్థికపరిస్థితి – స్థిరత్వం తప్పుతుంది.
- జలబీభత్సాలు – వాయు బీభత్సాలు – టోరంటోల వంటి సంఘటనలు ఈ సంవత్సరం కూడా బాధిస్తాయి.
- దక్షిణ అమెరికా బాగా దెబ్బతింటుంది.
- పసుపు ధర పెరుగుతుంది.
- పత్తి, శనగ రైతులకు అనుకూలం.
- మే నుండి అన్ని అపరాల ధరలూ పెరుగుతాయి.
- మిర్చి ధర ఘాటెక్కుతుంది.
- పశుసంతతికి కష్టకాలం.
- పొగాకు పరిశ్రమ తీవ్ర సంక్షోభంలో పడుతుంది.
- ఈ సంవత్సరం ప్రళయం లాంటిది సంభవిస్తుంది – జననష్టం.
- సీమాంధ్రలో భూప్రకంపనలు.
- ఆయుర్వేదిక్ ఫోబియా విజృంభిస్తుంది.
- పంజాబ్‌లో బిజెపి కూటమికి చేదు అనుభవాలు.
- రైతులకు పంట చేతికి వచ్చినా నోటికి అందదు.
- తెలంగాణలో వ్యవసాయం బాగుంటుంది.
- అమెరికాలో రాజ్యాంగ సంక్షోభం.
- క్రికెట్ మినహా అన్ని రంగాలలో విషతుల్య ఫలితాలు, కష్టాల కడలిలో ఆస్ట్రేలియా.
- రైతులకు నకిలీ విత్తనాల సమస్య.
- పాకిస్థాన్‌లో తీవ్ర భూకంపం.
- దేవాలయాలు రాజకీయ నిరుద్యోగులకు పునరావాస కేంద్రాలు – విచక్షణారహితమైన దోపిడివాదుల కోట్ల అవినీతి (సీమాంధ్ర)
- మత్తులో తూలుతున్న మహానగరం.
- బెంగుళూరులో బైటపడనున్న నమ్మలేని నిజాలు.
- మిషన్ భగీరథ, మిషన్ కాకతీయ భవిష్యత్ తరాలకి మంచి శకునం.
- వారసులొస్తున్నారు – భరించండి.
- ఉగ్రవాదానికి చైనా సహకారం.
- క్రికెట్ క్రీడాకారులు అశ్విన్, షమీ, రవీంద్ర జడేజాలు బాగా రాణిస్తారు.

# హేవిళంబినామ సంవత్సర (2017 - 18) రాశిఫలాలు



## మేషం *(ఆదాయం-8, వ్యయం-14, గౌరవం-4, అగౌరవం-3)*

ఈ రాశి వారికి ఈ సంవత్సరం అనుకూలంగా ఉంది. గతంలో మీ జీవిత భాగస్వామి పేరుమీద కొనుగోలు చేసిన భూమికి మంచి ధర వస్తుంది. మంచి ధరకు అమ్మి వేరే చోట వ్యవసాయ భూమి కొనుగోలు చేస్తారు. దుష్ట స్నేహితుల బారి నుండి మీ వారిని రక్షించుకోవడానికి మీరు చేసేప్రయత్నాలు మంచి ఫలితాలనిస్తాయి. కొన్ని సందర్భాలలో కీలక స్థానంలో ఉన్న అధికారులు చెప్పుడు మాటలు విని, మీ నుండి కనీసం వివరణ కూడా కోరకుండా ఏకపక్ష నిర్ణయాలు చేస్తారు. లౌక్యంగా ప్రతిఘటించి, వాస్తవాలు నిరూపించి మీ ప్రయోజనాలు, మీ స్థానాన్ని కాపాడుకోగలుగుతారు. కమర్షియల్ ఏరియాలో విలువైన షాపుకాని, స్థలంకాని కొనుగోలు చేయగలుగుతారు. మీ సన్నిహితుల ప్రవర్తన నానాటికీ దిగదుడుపుగా ఉంటుంది. తోలు ఉత్పత్తులలో చేయు వ్యాపారాలు, ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు తక్కువ వ్యవధిలో సాగే తాత్కాలిక వ్యాపారాలు కలిసివస్తాయి. నౌకా రవాణా, జల రవాణా లాభిస్తుంది. వివాహాది శుభకార్యాలకి సంబంధించి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. చార్టెడ్ అకౌంటెంట్స్ వారికి ఈ సంవత్సరం బాగుంది. కీర్తిప్రతిష్టలు లభిస్తాయి. అయితే క్లయింట్స్ నిబద్ధత గురించి ఒకటికి రెండు సార్లు ఆలోచన చేయండి. విద్యార్థినీ, విద్యార్థులకు ప్రొఫెసర్ల వల్ల అన్యాయం జరుగుతుంది. రీవాల్యుయేషన్, రీకౌంటింగ్ లాభిస్తాయి. వీసా స్టాంపింగ్‌కు వెళ్ళే వారికి అనుకూల కాలం. ఆర్థికపరిస్థితులు కుదుటపడతాయి. దీర్ఘకాలిక సమస్యలు తీరిపోతాయి. అష్టమూలికా తైలంతో నిత్యం దీపారాధన చేయటం అన్నివిధాలా మంచిది. వ్యాపారసంబంధమైన విషయాలు బాగున్నాయి. ఈ రాశివారు అఘోర పాశుపత హోమం చేయించుకోవం వలన మంచి ఫలితాలు పొందుతారు. వ్యాపారంలో నూతన మార్పులు, చేర్పులు కలిసివస్తాయి. ప్రజాదరణ బాగుంటుంది. ప్రజా సంబంధాలు మెరుగుపరుచుకోవడానికి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కుటుంబ విషయాల కారణంగా కొంతమంది వాలంటరీ రిటైర్మెంట్ తీసుకుంటారు. మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. అవార్డులు, రివార్డులు లభిస్తాయి. వృత్తి పరంగా నక్క మనస్తత్వం కలిగిన వ్యక్తుల వలన ఇబ్బందులు ఎదురవుతాయి. పోటీపరీక్షలలో విజయం సాధిస్తారు.

---



## వృషభ రాశి *(ఆదాయం-2, వ్యయం-8, గౌరవం-7, అగౌరవం-3)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. పోటీ పరీక్షలు, గ్రూప్స్‌కి, సివిల్ సర్వీసులకు ప్రయత్నం చేసేవారికి ఈ సంవత్సర ద్వితీయార్ధంలో మెరుగైన ఫలితాలు వస్తాయి. ఆర్థికపురోగతి బాగుంది. వృత్తి, ఉద్యోగాలపరంగా సంతృప్తి కలుగుతుంది. దీర్ఘకాలిక సమస్యలు పరిష్కారం అవుతాయి. కోర్టుతీర్పులు అనుకూలంగా వస్తాయి. ప్రేమ, మమకారం ఎవరిమీద అయితే పెంచుకున్నారో వాళ్ళు మంచి అభివృద్ధిలోకి వస్తారు. నూతన గృహనిర్మాణం అనే కల నెరవేరుతుంది. ఆరోగ్యం మెరుగు పడుతుంది. వ్యాపార సంబంధమైన విషయాలు ఇబ్బంది లేకుండా నడుస్తాయి. భాగస్వామ్యంతో చేసే ఏ వ్యాపారమైనా కలిసివస్తుంది. ప్రతిష్టాత్మకమైన యూనివర్సిటీలలో చదువుకోవడానికి సీటు వస్తుంది, వైద్యవిద్యకు సంబంధించి మీ కృషి ఫలిస్తుంది. అదేవిధంగా టీచింగ్ ప్రొఫెషన్‌లో ఉన్నవారికి నూతన అవకాశాలు కలిసివస్తాయి. ట్యూషన్లు చెప్పేవారికి డిమాండ్ పెరుగుతుంది. ధనం సంపాదించడం కోసం అహర్నిశలు కష్టపడతారు. ఎప్పుడు పడనంత శ్రమ పడతారు. శ్రమకు తగిన ఫలితం మూడొంతులు చేతికి వస్తుంది. ఈ రాశి వారు అఘోరపాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలు పొందుతారు. మహాతీర్థం పొడితో అభిషేకం చేయండి. చేతికి వచ్చిన ధనం సద్వినియోగం అవుతుంది. మెల్లమెల్లగా బాధ్యతలు, ఋణాలు తీర్చుకుంటారు. కఠినమైన కాలాన్ని అధిరోహించడంలో ఒక వింత అనుభూతి పొందుతారు. ఇంట్లో మరొకరి సంపాదన ప్రారంభం కావడం మీ మానసిక సంతోషానికి కారణం అవుతుంది. విడిపోవాలని నిర్ణయించుకున్న భార్యాభర్తలను కలపడానికి మీరు చేసేప్రయత్నాలు ఫలించవు. కొంతమందికి పిల్లనిచ్చిన చోట అల్లుడితో సమస్యలు, కొడుకుకి పెళ్ళి చేసి పిల్లను ఇంటికి తెచ్చుకుంటే కోడలితో సమస్యలు గోడపెట్టు చెంప పెట్టుగా తయారవుతారు. క్లిష్టమైన ఈ సమస్య నుండి బయటపడడానికి పరిపరివిధాల శ్రమించవలసివస్తుంది. చాలా విషయాలలో మౌనంగా ఉండవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. నిజాలు మాట్లాడే స్వేచ్ఛ కూడా ఉండదు. సనాతన సాంప్రదాయాలకు పాతర వేసి ఆధునిక, కృత్రిమ జీవితానికి అలవాటు పడి సంస్కార విహీనంగా ప్రవర్తిస్తున్న వారిని, వీరిని ప్రోత్సహిస్తున్న వారిని ఏమీ చేయలేని పరిస్థితి ఏర్పడుతుంది. అత్యంత సన్నిహితమైనవి వివాహజీవితాలు, అత్యంత బలహీనమైనవి వివాహబంధాలు అని సరిపెట్టుకుంటారు. ఏ విషయంలోనైనా వీరోచిత పోరాటం చేస్తారు.

---



## మిథున రాశి *(ఆదాయం-5, వ్యయం-5, గౌరవం-3, అగౌరవం-6)*

ఈ రాశి వారికి ఈ సంవత్సరం బాగుంది. చిరకాల ప్రత్యర్థులపై మీరు సంధించిన లేఖాస్త్రం బ్రహ్మాస్త్రం అవుతుంది. మీ సంతానం లేక ఆత్మీయ బంధువర్గంలో ఒకరు ప్రతిష్టాత్మక ఉద్యోగం సంపాదిస్తారు. న్యాయబద్ధంగా మీకు రావలసిన ఆర్థిక ప్రయోజనాలను కోర్టు ద్వారానే సంపాదించుకోగలుగుతారు. మీ కీర్తిప్రతిష్టలు ఇతరులు సొమ్ము చేసుకునే ప్రయత్నాన్ని గట్టిగా అడ్డుకుంటారు. చాలాకాలంగా చేయాలనుకున్న ఈ పనిని పూర్తిచేస్తారు. పెద్దల ఆరోగ్యం మీ మనోవేదనకు కారణం అవుతుంది. అయితే చెప్పుకోదగిన అపశృతులు ఉండకపోవచ్చు. నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. సంవత్సర ద్వితీయార్ధంలో మీ అంతరాత్మ సాక్షికి విరుద్ధంగా ఆర్థికప్రయోజనాల కోసం కొన్ని కార్యక్రమాలు చేస్తారు. ఆఫీసుకు సంబంధించి బ్రాంచి ఏర్పాటు చేస్తారు. పెట్టుబడికి వెనుదీయరు. కొత్తవారిని నియమిస్తారు. అన్ని విధాలా బాగానే చూసుకున్నా కొంతమంది వ్యక్తులు నిత్యం సణుగుతూనే ఉంటారు. వారి వల్ల ప్రయోజనం ఉండదు. అయినా భరించక తప్పదు. దైవికం అనే పొడితో ఇంట్లో కానీ, వ్యాపార ప్రదేశాలలో

కానీ ధూపం వేయటం అన్నివిధాలా శ్రేయస్కరం. కుటుంబసభ్యులకు బంగారు ఆభరణాలు కొనివ్వాలనే మీ కోరిక నెరవేరుతుంది. దొంగస్వామీజీల పట్ల అప్రమత్తంగా ఉంటారు. విదేశీ సంబంధ, బాంధవ్యాలు పెరుగుతాయి. వెబ్‌సైట్స్ వల్ల లాభపడతారు. మితిమీరిన ఆధునిక సాంకేతిక పరికరాలు కొనుగోలు చేయరు. అటువంటి వాటికి దూరంగా ఉండాలని భావిస్తారు. ఈ రాశి వారు అంగారక పాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలు లభిస్తాయి. సాంకేతిక విద్య, వైద్యవిద్యకు సంబంధించిన విషయాలు, విదేశీవిద్యకు సంబంధించిన విషయాలు కూడా అతికష్టం మీద సానుకూలపడతాయి. గతంలో అవకాశం ఉన్నా ఆస్తులు కొనుగోలు చేయనందుకు బాధపడతారు. ప్రతిష్టాత్మకమైన యూనివర్సిటీలలో సీటు లభిస్తుంది. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. నిరుద్యోగుల కష్టాలు తీరుతాయి, మంచి ఉద్యోగాలు లభిస్తాయి. ఆరోగ్య సంబంధిత విషయాలలో, సెల్ఫ్ డ్రైవింగ్ విషయాలలో జాగ్రత్తలు అవసరం. అష్టమూలికా తైలంతో లక్ష్మీతామర వత్తులతో దీపారాధన చేయటం అన్నివిధాలా శ్రేయస్కరం. స్త్రీల వల్ల చికాకులు, ఇబ్బందులు సంభవిస్తాయి.

---



## కర్కాటక రాశి *(ఆదాయం-14, వ్యయం-2, గౌరవం-6, అగౌరవం-6)*

ఈ రాశి వారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. విదేశీయాన ఖర్చులకు, విద్యాసంబంధమైన విషయాలకు, పెట్టుబడి పెట్టడానికి ఎక్కువ మొత్తంలో ధనం ఖర్చు చేస్తారు. మీరు చేస్తున్నది మంచికో, చెడుకో అర్థం కాని పరిస్థితి ఏర్పడుతుంది. మొత్తం మీద ఫలితాలు బాగుంటాయి. సంతానం కుటుంబసభ్యుల కోరిక కాదనలేక ఆర్థికభారం మోస్తారు. ఆరోగ్య వృద్ధికి కూడా ధనం ఖర్చవుతుంది. వీటన్నింటినీ భరించడానికి కావలసిన ధనం ఎప్పటికప్పుడు సర్దుబాటు కావడం విశేషం. కొన్ని అఖండమైన విజయాలు మీ స్వంతం చేసుకుంటారు. మధురక్షణాలు మరువలేరు. సమాజంలో పరువు, ప్రతిష్ట పెరుగుతుంది. మీ ఉన్నతి చూసి సంతోషించడానికి ముఖ్యమైన వ్యక్తి లేకపోవడం మీ మానసిక వైరాగ్యానికి దారి తీస్తుంది. సామాజికంగా, రాజకీయంగా వచ్చే మార్పులు మీ మీద ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రభావాన్ని చూపిస్తాయి. అమ్మకుండా ఉంచిన ఆస్తులు కొండంత అండగా ఇప్పుడు నిలుస్తాయి. బంజరు భూములు, బంగారు భూములవుతాయి. గతంలో తీసుకున్న కఠిన నిర్ణయాలు, పడిన కష్టాలు ఇప్పుడు లాభిస్తాయి. మాటపట్టింపు, మొండి వైఖరివల్ల కొన్నింటికి దూరంగా ఉంటారు. పరిస్థితుల ప్రభావం వల్ల జీవనమార్గం సక్రమంగానే దొర్లుతుంది. ఆరావళికుంకుమతో మీ ఇష్టదేవతలకు పూజలు చేయండి. మంచి ఫలితాలు వస్తాయి. అనువంశికంగా రావలసిన ఆస్తులు ఎట్టకేలకు సానుకూలపడతాయి. దీర్ఘకాలికంగా వివాదంలో ఉన్న ఆస్తి గొడవలు ఒక కొలిక్కి వస్తాయి. రూపాయి ఖర్చయ్యే చోట వందరూపాయలు ఖర్చవుతాయి. సంతానం భవిష్యత్తు కోసం ధనాన్ని ఖర్చు చేస్తారు. వారి పేరుమీద స్థిరాస్తులు కొంటారు. సామాజిక పరిస్థితుల మీద విరక్తి పుడుతుంది. ఈ సమాజంలో మనుగడ సాధించగలమా? అన్న మానసిక వేదన కలుగుతుంది. ఈ రాశివారు భృగు పాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలను పొందుతారు. విద్య, వైజ్ఞానిక రంగాలలో అనుకున్నది సాధిస్తారు. వృత్తిఉద్యోగాల పరంగా శారీరక, మానసిక ఒత్తిడి అధికంగా ఉంటుంది. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా ఉంటాయి. కాంట్రాక్ట్ పద్ధతిన ఉద్యోగాలు చేస్తున్నవారికి ఉద్యోగం పర్మినెంట్ అవుతుంది. ఆరోగ్యం విషయంలో జాగ్రత్తలు అవసరం. ముఖ్యమైన విషయాలు రహస్యంగా ఉంచడం వల్ల ఎంతగానో లాభపడతారు. మీరు ఊహించనటువంటి మంచి అవకాశం వస్తుంది, నూతన బాధ్యతలను సంతోషంగా స్వీకరిస్తారు.

---



## సింహ రాశి *(ఆదాయం-2, వ్యయం-11, గౌరవం-2, అగౌరవం-2)*

ఈ రాశి వారికి ఈ సంవత్సరము మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. ఆర్థికంగా ఎదుటి వారికి సహాయం చేయడం కూడా సమస్యలకు కారణం అవుతుంది. మనోహరమైన సుందర ప్రదేశాలు సందర్శించాలన్న మీ కోరిక నెరవేరుతుంది. పనికిమాలిన వారిని గొప్పవారిగా నమ్మడం మీకు ఇబ్బందిగా మారుతుంది. ఆహార, లోహపు వ్యాపారులకు, రెడీమేడ్ దుస్తుల వ్యాపారులకు, వైద్యులకు, చార్టెడ్ అకౌంటెంట్లకు, ఫైనాన్స్ వ్యాపారులకు, హోటల్ వ్యాపారులకు, మత్స్య వ్యాపారులకు, పాల వ్యాపారులకు, పబ్లికేషన్స్ వారికి, మందుల షాపుల వారికి, పాదరక్షల వ్యాపారులకు అనుకూలమైన కాలం. ఆయుర్వేద వైద్యుల పరిస్థితి బాగుంటుంది. హోమియోపతి వైద్యులకు కాలం అనుకూలంగా ఉంది. ప్రతి చిన్నవిషయానికి ఆటుపోట్లు ఎదురైనా చివరికి విజయవంతమైన ఫలితాలే వస్తాయి. మీ విజయాన్ని, సామర్థ్యాన్ని చూసి మనస్ఫూర్తిగా సంతోషించే వారు తక్కువ. మీరు సాధించిన ఉన్నత స్థితి చూసి సంతోషించే గతించిన ఒక ఆత్మీయుడు లేకపోవడం మీ మనోవేదనకు కారణమవుతుంది. భగవంతుని సంకల్పాన్ని మానవుడు ఎప్పటికీ ఊహించలేడని, ఎదుర్కోలేడనే వైరాగ్యం కలుగుతుంది. ఈ రాశివారు రుద్రపాశుపత హోమం చేయించుకోవటం వలన శుభఫలితాలు పొందుతారు. రాజకీయజీవితం బాగుంటుంది. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యాపార ఒప్పందాలు కుదుర్చుకుంటారు. రాజకీయ పైరవీలు కలిసివస్తాయి. నూతన బాధ్యతలు కొన్ని మీపై పడతాయి. మీ సమర్థతకు అగ్నిపరీక్షలు ఎదురవుతాయి. సమస్యలను చూసిపారిపోవడానికి, వదిలించుకోవడానికి మీకు స్వేచ్ఛ ఉండదు. అస్త్ర సన్యాసం చేసే అవకాశం ఉండదు. సమస్యలకు ఎదురొడ్డి పోరాడవలసిందే. నూతన వృత్తి, వ్యాపార, ఉద్యోగాల మీద దృష్టిపెడతారు. నిత్యం అష్టమూలికా గుగ్గిలంతో ఇంట్లో మరియు వ్యాపార ప్రదేశాలలో ధూపం వేయండి. మంచి జరుగుతుంది. మీ జీవితాశయం నెరవేర్చుకోవడానికి రాత్రింబవళ్ళు శ్రమిస్తారు. ఒక విలువైన ఆస్తిని కొనుగోలు చేయగలుగుతారు. కొన్ని విషయాలలో ఒడిదుడుకులను ఎదుర్కోవలసివస్తుంది, ఇది మీరు ఊహించనటువంటి పరిణామం. ఎముకలకు సంబంధించిన అనారోగ్యం రావచ్చును, జాగ్రత్త వహించండి. నమ్మకద్రోహులను ఆదరించకుండా దూరంగా ఉంచండి, గతంలో చేసిన పొరపాట్లే మళ్ళీ చేయవద్దు. సంతానానికి సంబంధించిన విషయాలలో కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసిన పరిస్థితులు గోచరిస్తున్నాయి.

---



## కన్యా రాశి *(ఆదాయం-5, వ్యయం-5, గౌరవం-5, అగౌరవం-2)*

ఈ రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. రాజకీయ పదవుల కోసం ప్రయత్నించే వారికి స్వంతవ్యక్తులే పోటీదారులవుతారు. సక్రమంగా ఆలోచనలు చేసి ఆచితూచి మాట్లాడే మీ వైఖరి మేలు కలిగిస్తుంది. గతంలో మీకు అపకారం చేసిన వ్యక్తులకు

అవకాశం వచ్చినా అపకారం చేయరు. అందుకు ప్రతిగా వాళ్ళ సహాయసహకారాలు మీకు ఎంతగానో ఉపయోగపడతాయి. స్టేషనరీ, ఎలక్ట్రానిక్స్ వస్తువులు, తోలు ఉత్పత్తులతో చేసే వ్యాపారాలు, లోహపు హెర్బల్ వ్యాపారాలు లాభసాటిగా సాగుతాయి. వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపారాలు న్యాయంగా చేసేవారికి ఎలాంటి లాభాలూ రావు. పండ్ల, పూల తోటలకు సంబంధించిన వ్యాపారాలు బాగుంటాయి. శుభకార్యాలకు సంబంధించిన విషయ వ్యవహారాలు ఆకస్మికంగా ముడిపడతాయి. దీర్ఘకాలికంగా ఉన్న విద్వేషాలను రూపుమాపుకోవడం మంచిది. ఎన్నాళ్ళు పోరాటం చేసినా కొన్ని విషయాలలో ఫలితం దక్కదు. ఆదాయం ఉంటుంది. చేతిలో మాత్రం ధనం నిలవదు. తగాదాలకు, వివాదాలకు దూరంగా ఉండండి. ప్రయోజనం లేని విషయాలను పట్టుకుని సాగదీయవద్దు. ఇతరులకు సలహాలు ఇవ్వడం వల్ల విరోధులవుతారు. వారికి లేని శ్రద్ధ మీకు అనవసరం. మీ విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు తీసుకోండి. సర్పదోష నివారణ చూర్ణముతో స్నానం చేయండి, సర్పదోషాలు నివృత్తి అవుతాయి. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోండి. సంవత్సర ద్వితీయార్థంలో స్వంత ఇంటి కల నెరవేరుతుంది. కాల్‌లెటర్స్ ద్వారా ఉద్యోగాలు వస్తాయి. కానీ ఉద్యోగపరంగా తృప్తి ఉండదు. ఈ రాశివారు నవగ్రహ పాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలను పొందుతారు. సంవత్సర ద్వితీయార్థంలో మంచి ఉద్యోగం వస్తుంది. పాత సమస్యలు పరిష్కారం అవుతాయి, కొత్త సమస్యలు పుట్టుకొస్తాయి. వృత్తిఉద్యోగాలలో నూతన మార్పులు వస్తాయి. సామాజికంగా వచ్చిన మార్పులు మీపై ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ ప్రభావం చూపుతాయి. విద్యాసంబంధమైన విషయాలలో కొన్ని ఆటంకాలను అధిగమిస్తారు. మీకు అనుభవంలేని రంగంలో పెట్టుబడి పెట్టి కొద్దిపాటి విజయాలు సొంతం చేసుకోగలుగుతారు. దూరప్రాంతంలో ఉన్న మీ ఆత్మీయుల వల్ల ఆర్థికసాయం లభిస్తుంది. విడిపోయినటువంటి మిత్రవర్గం తిరిగి దగ్గరవుతారు. కళారంగంలో రాణిస్తారు. క్రీడలలో గుర్తింపు వస్తుంది, అవార్డులు లభిస్తాయి.

---



## తులా రాశి *(ఆదాయం-2, వ్యయం-8, గౌరవం-1, అగౌరవం-5)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం సానుకూల ఫలితాలు గోచరిస్తున్నాయి. ప్రజాసంబంధాలు జాగ్రత్తగా నడుపుకోవడం కష్టతరమవుతుంది. ఉద్యోగపరంగా కష్టపడినందుకు ఫలితం దక్కుతుంది. ప్రమోషన్ లభిస్తుంది. ప్రమోషన్ ద్వారా లభించిన అధికారంతో మీ సహచరులకు మీరు న్యాయం చేస్తారు. ఆదాయానికి మించి ఖర్చులు సూచిస్తున్నాయి. మిమ్మల్ని మీరు ప్రశాంతంగా ఉంచుకోవడానికిగాను, సాధ్యమైనంతవరకు వివాదాలకు దూరంగా ఉంటారు. కుటుంబంలోని పెద్దల ఆరోగ్యం విషయమై శ్రద్ధ అవసరమవుతుంది. వ్రాతపూర్వకంగా ఒప్పందాలు జరగవలసిన చోట పెద్దమనుషుల మాటలతోనే సరిపెట్టుకోవలసివస్తుంది నిత్యం నాగసింధూరం ధరించండి. అందివచ్చిన అవకాశాలను చేజార్చుకోకుండా ఉపయోగించుకోగలిగితే మంచి ఫలితాలు సాధిస్తారు. మీపై వచ్చిన నిందారోపణలు రూపుమాపు కోవడానికి గట్టి ప్రయత్నాలు చేస్తారు. ఇతర భాషలలో ప్రావీణ్యం సంపాదించడానికి షార్ట్‌టర్మ్ కోర్సులలో చేరతారు. సుదూర ప్రాంతాల నుండి శుభవార్తలు అందుకుంటారు. కొన్ని సందర్భాలలో అధికంగా కష్టపడవలసివచ్చినప్పటికీ సానుకూల ఫలితాలు సాధిస్తారు. ఈ రాశివారు సుబ్రహ్మణ్య పాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలను సాధిస్తారు. సహోదర సహోదరి వర్గానికి చెందిన కొన్ని బాధ్యతలు మీ నెత్తిన పడతాయి. ధర్మాన్ని అధిగమించలేక, కుటుంబసభ్యులను ఒప్పించలేక మానసిక ఒత్తిడికి లోనవుతారు. మీకు జరిగిన నమ్మకద్రోహానికి తగిన ప్రతీకారం తీర్చుకుంటారు. వాస్తవాలకు అతీతంగా ఊహాలోకంలో మీరు తీసుకున్న నిర్ణయాలు మంచి ఫలితాలను ఇవ్వవు. ఏకపక్ష నిర్ణయాలు కలిసిరావు. నలుగురితో కలిసిచర్చించి, నిపుణుల సలహాలు తీసుకుని మీ ఆలోచనలను అమలు చేయండి. వాయిదాల చెల్లింపు మీద ఒక భూమి కానీ, అపార్ట్‌మెంట్ కానీ కొనుగోలు చేస్తారు. ఫాస్ట్‌ఫుడ్స్, బేకరీ వ్యాపారాలు, హాస్టళ్ళ నిర్వహణ మొదలైనవి బాగుంటాయి. మీ ద్వారా లబ్ధిపొంది ఉన్నతస్థానాలలో కూర్చున్న వ్యక్తులు మీ మాటను ధిక్కరిస్తారు. మీ ఆలనాపాలనలో పెరుగుతున్నవారు, మీకన్నా చిన్నవాళ్ళు మీ మాటను ధిక్కరిస్తారు. ఉద్యోగపరంగా మీరు తీసుకున్న నిర్ణయాలను క్రిందిస్థాయి ఉద్యోగులు వ్యతిరేకిస్తారు, చెప్పుడు మాటలు మోస్తారు. తాత్కాలిక వేతనాల మీద ఉద్యోగం చేస్తున్నవారికి ఉద్యోగం పర్మినెంట్ అవుతుంది. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి.

---



## వృశ్చిక రాశి *(ఆదాయం-8, వ్యయం-14, గౌరవం-4, అగౌరవం-5)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. క్రమశిక్షణాయుతమైన పద్ధతులలో, మానవీయకోణంలో మీరు గడుపుతున్న జీవితం అందరికీ ఆదర్శప్రాయమవుతుంది. దీర్ఘకాలిక కోర్టువ్యవహారాలు పరిష్కారమవుతాయి. భవిష్యత్‌లో మీ ఎదుగుదల ఇబ్బంది అవుతుందని మీ వైరివర్గం ఇప్పటి నుంచే బురదజల్లే ప్రయత్నాలు చేస్తుంది. ఉద్యోగంలోను, వృత్తిలోను ప్రమాదకరమైన వ్యవహారాలను విజయవంతంగా ఎదుర్కొంటారు. ఉద్యోగంలో మార్పు, పదోన్నతి, బదిలీ వంటివి సంభవిస్తాయి. కార్యాలయంలో మీ స్థాయి, మీ స్థానం పదిలంగా ఉంటాయి. మీరు పనిచేస్తున్న విధానం మీ పైఅధికారులకు నచ్చదు. నూతన వ్యాపారాలు, ఉద్యోగాలు మీ అంచనాలకు మించి బాగుంటాయి. విలువైన స్థిరాస్తులు అమ్మాలని నిర్ణయించుకుంటారు. సంతానం కోసం ధనం అధికంగా ఖర్చు చేయవలసివస్తుంది. సంతానం పురోగతి మీరు ఆశించినంత సంతృప్తి కలిగించదు. అనేక రకాల ఆలోచనలు, అంతర్గత భావాలు కోపాన్ని అదుపు చేసుకుని మనస్సులో ఒక విధంగా పైకి ఒక విధంగా ఉంటారు. మనస్సు విప్పి మాట్లాడడం వల్ల సమస్యలు వస్తాయని అనుభవపూర్వకంగా తెలుసుకుంటారు. వివాహాది శుభకార్యాలు సానుకూల పడతాయి. ఈ రాశివారు రుద్రపాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలు పొందుతారు. సంతానానికి సంబంధించి, వారి అభివృద్ధికి సంబంధించి చేసే కృషికి ఖర్చు పెట్టే ధనానికి, అన్నింటికీ మించి మీ ఆరాటానికి తగిన విధంగా ప్రతిఫలం లభిస్తుంది. పిల్లలు విద్యాపరంగా మంచి పురోగతి సాధిస్తారు. అనారోగ్యసమస్యలు ఇబ్బంది పెడతాయి. అనువంశిక ఆస్తులను నిలబెట్టుకోగలుగుతారు. పూజలలో, శుభకార్యాలలో సుమంగళి పసుపును ఉపయోగించండి. మీ ప్రయత్నం లేకుండానే కొన్ని మంచి పనులు ముడిబడతాయి. కీళ్ళనొప్పులు, ఎలర్జీ సమస్యలు, జీర్ణకోశ సంబంధిత సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. ఆధ్యాత్మిక గ్రంథ పఠనం వల్ల మనోబలం పెరుగుతుంది. గృహనిర్మాణ సామాగ్రి, ఆయుర్వేదం, హోమియోపతి, అల్లోపతి, మందులు, భూములకు సంబంధించిన వ్యాపారాలు,

ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు లాభిస్తాయి. రాజకీయ పైరవీలు ఫలిస్తాయి. సంవత్సర ద్వితీయార్థంలో మీ పలుకుబడి ద్వారా వచ్చిన లాభాలని ధర్మబద్ధంగా మీ భాగస్వాములకు కూడా పంచుతారు.

---



## ధనస్సు రాశి *(ఆదాయం-11, వ్యయం-5, గౌరవం-7, అగౌరవం-5)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. విద్యా, ఆర్థికసంబంధిత విషయాలలో పురోగతి బాగుంటుంది. మీ జీవితాశయం సాధించుకోవడానికి విశేషంగా కృషి చేస్తారు. స్నేహితులు, సన్నిహితులు ప్రతి విషయంలో అండదండగా ఉంటారు. రాజకీయజీవితంలో ఒడిదుడుకులు ఉన్నప్పటికీ మొత్తం మీద సజావుగానే సాగుతుంది. మంచివాళ్ళను ఆదర్శంగా తీసుకుని మీ జీవనగమనంలో కొన్ని మార్పులు చేస్తారు. సంతానపురోగతి బాగుంటుంది. వారు మెరిట్ మార్కులు సాధిస్తారు. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి. కొన్ని మంచికార్యాలకు సంబంధించి ఋణాలు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తిఉద్యోగాల పరంగా అభివృద్ధి బాగుంటుంది. ఉద్యోగంలో నూతన బాధ్యతలు సక్రమంగా నిర్వహించి, పైఅధికారుల మెప్పు పొందుతారు. యూనియన్ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటారు. వివాద రహిత వ్యక్తిగా మీకు పేరు వస్తుంది. ఇతరుల విమర్శలు పట్టించుకోరు. ప్రతిస్పందించరు. సర్వరక్షా చూర్ణముతో స్నానమాచరించిన గ్రహముల వలన కలుగు బాధలు తొలగిపోయి మంచి జరుగుతుంది. ఆర్థిక పరిస్థితి అభివృద్ధి చేసుకోవడానికి విశేషంగా కృషి చేస్తారు. సన్నిహితుల పేరు మీద వ్యాపారం ప్రారంభిస్తారు. వ్యాపారం సక్రమంగా సాగడానికి అవసరమైన బలం, బలగం, రాజకీయ పలుకుబడి ఉపయోగపడతాయి. విలువైన స్థిరాస్తులలో కొంత భాగాన్ని అమ్ముదామని ప్రయత్నించినా కొన్ని కారణాల వలన కొంత కాలం వాయిదా వేస్తారు. న్యాయస్థానాలలో తీర్పులు మీకు అనుకూలంగా వస్తాయి. కుటుంబంలో మరొకరి సంపాదన పెరుగుతుంది. ఈ రాశివారు అఘోర పాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలను పొందుతారు. సమాజంలో ఉన్నతస్థాయి వ్యక్తులతో పరిచయం కలుగుతుంది, వారు కూడా మీ వ్యాపారంలో భాగస్వాములు అవుతారు. విద్యాసంబంధమైన విషయాలు, ఉద్యోగసంబంధమైన విషయాలు, విదేశీయాన సంబంధమైన విషయాలు బాగుంటాయి. సాంకేతికవిద్యలోనూ, వైద్యవిద్యలోనూ రాణిస్తారు. సామర్థ్యంలేని వ్యక్తులకు వ్యాపారం అప్పగించి నష్టపోతారు, జాగ్రత్త వహించండి. వ్యక్తుల సామర్థ్యం అంచనా వేయడంలో పొరపాటు పడతారు. విలువైన వస్తువులను, ఆభరణాలను ఇంట్లోవారి సంతోషం కోసం కొనుగోలు చేస్తారు. నమ్మకస్తులైన పనివారిని నియమించుకుంటారు. మీకు సంబంధించిన వ్యక్తిగత విషయాలు గాని, కుటుంబ విషయాలు గాని బయటకు పొక్కకుండా జాగ్రత్తలు తీసుకుంటారు. సంతానపురోగతి బాగుంటుంది.

---



## మకర రాశి *(ఆదాయం-14, వ్యయం-14, గౌరవం-3, అగౌరవం-1)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. ఏలిననాటి శని ప్రభావం వల్ల ఎటువంటి ఇబ్బందులు రాకుండా ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయించి, అఘోరపాశుపత హోమం శైవాగమం ప్రకారం చేయాలి. ఆర్థికంగా ఎంత ఆదాయం వచ్చినా దాచుకునేది ఏమీ ఉండదు. రావాల్సిన డబ్బుకు ఖర్చు రెడీగా ఉంటుంది. ముఖ్యమైన కొన్ని పనులు విజయవంతం అవుతాయి. ఆర్థిక, ఆరోగ్యస్థితి బాగున్నా ఆరోగ్యపరంగా కొన్ని జాగ్రత్తలు అవసరం అవుతాయి. గృహనిర్మాణ సంబంధమైన వ్యాపారాలు కొంత నత్తనడక నడిచినా లాభాలకు ఇబ్బంది ఉండదు. ఆర్థికపరమైన పురోగతి బాగుంటుంది. స్థిరచరాస్తులు వృద్ధి చేస్తారు. పట్టుదలతో కృషి చేసి సానుకూల ఫలితాలు సాధిస్తారు. సమాజంలో మీరంటే ఏమిటో నిరూపించుకుంటారు. గతంలో మిమ్మల్ని కించపరిచిన వారే గౌరవించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. రహస్యంగా స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. వృత్తిఉద్యోగాల పరంగా ఉన్న పోటీని సమర్థవంతంగా ఎదుర్కొంటారు. మహాలక్ష్మీపూజలో లక్ష్మీచందనం ఉపయోగించండి, ధరించండి. అసూయాగ్రస్తులైన శత్రువర్గంతో ఇబ్బందులు ఏర్పడినా వాటిని అధిగమించగలుగుతారు. శతృవర్గమంటే చిన్న శతృవర్గంకాదు. ఉన్నత స్థానంలో ఉన్న అధికారుల అండదండలు కలిగిన వారితో పోరాటం చేయవలసి వస్తుంది. మీ మిత్రవర్గం, మీకు సన్నిహితంగా చెప్పుకునే వారు మీరు పోరాటంలో ఓడిపోవాలని కోరుకుంటారు. శల్య సారథ్యం చేస్తారు. దైవానుగ్రహం వల్ల మీరే విజయం సాధించగలుగుతారు. మీ ఉనికికి, మీ స్థానానికి ఇబ్బంది లేకుండా జాగ్రత్తలు తీసుకుంటారు. ప్రేమగా చూడటం ధర్మమే అవుతుంది. కానీ ఇది మీ విషయంలో పెద్ద అపరాధంగా మారుతుంది. కలియుగ ధర్మానికి ఇది పరాకాష్ఠ. వివాహం చేసుకోవడంతోనే అన్ని బంధాలు తెగిపోతాయా? స్వేచ్ఛ నశించి పోతుందా? జన్మనిచ్చిన వారికి, తోడబుట్టినవారికి సహాయం చేయటం నేరం అవుతుందా? మొదలైన ప్రశ్నలకు అంతరాత్మ మనస్సుకు సమాధానం చెప్పలేదు. సంతానపురోగతి బాగున్నప్పటికీ వారిలో ఒకరి ప్రవర్తన ఇబ్బందికరంగా మారుతుంది, తగిన జాగ్రత్తలు తీసుకుంటారు. హేళన, మితిమీరిన చతురోక్తుల వలన సున్నితమైన మనస్తత్వం కలిగినవారికి దూరం అయ్యే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి.

---



## కుంభ రాశి *(ఆదాయం-14, వ్యయం-14, గౌరవం-6, అగౌరవం-1)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం బాగుంది. కుటుంబపురోగతి, ఆర్థికపురోగతి బాగుంటాయి. బలహీనులైన అధికారులు, పనికిరాని స్నేహితులు, బంధువర్గం దూరమవుతారు. మీకు రావల సిన ధనం కొద్దికాలం ఇతరుల చేతిలో ఉంటుంది. మారు పేరాలకు సంబంధించిన లావాదేవీలు లాభిస్తాయి. ఆర్థికపురోగతికి నూతన వ్యాపారాలు చేయాలని గట్టిగా నిర్ణయించుకుంటారు. అయితే ఈ విషయాన్ని గోప్యంగా ఉంచుతారు. మీడియా వల్ల మేలు జరుగుతుంది. న్యాయపోరాటానికి కొన్ని విషయాలలో సిద్ధపడతారు. సినిమా, టివి రంగంలోని వారికి, ట్రావెల్స్, ఆటోమొబైల్స్‌రంగంలోని వారికి అనుకూలంగా ఉంటుంది. అపార్ట్‌మెంట్ కొనుగోలు విషయంలో జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయం తీసుకోండి. చెప్పుడు మాటలు విని కాకుండా, వాస్తవాలు స్వయంగా తెలుసుకుని నిర్ణయం తీసుకోండి. బంగారం, వెండి, విలువైన వస్తువుల భద్రత విషయంలో జాగ్రత్త వహించండి. కాంట్రాక్టు, సబ్ కాంట్రాక్టులు, లీజులు అనుకూలిస్తాయి. వ్యాపారంలో నూతన శాఖలు నెలకొల్పుతారు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న విద్యాసంస్థలకు మంచి పేరు ప్రఖ్యాతలు లభిస్తాయి. నిరుద్యోగులైన విద్యావంతులకు చదువుకున్న చదువుకు తగిన ఉద్యోగం లభిస్తుంది. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. జీవితాశయం నెరవేరుతుంది. రాజకీయజీవితం

బాగుంటుంది. ఆశించిన లాభాలు, ఫలితాలు మీకు చేతికి అందుతున్న వేళ స్వార్థపరులు మీకు సన్నిహితంగా మెలుగుతారు. చాలా జాగ్రత్త వహించండి. నరదృష్టి, బంధుఘోష అధికంగా ఉంటుంది. పూజలలో సిద్ధగంధము ఉపయోగించండి. అన్నదానానికి, గో సంరక్షణకు మీ శక్తిమేర విరాళాలిస్తారు. ఇందువల్ల మీరు నష్టపోరు. మంచి ఉద్యోగం లభిస్తుంది. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి. వైద్యవిద్యలో సీటు లభిస్తుంది. మీకు రావలసిన బిల్లులు, వడ్డీలు, అసలు ధనం చేతికి అందుతుంది. ఈ రాశివారు అఘోరపాశుపత హోమం చేయించుకోవటం వలన మంచి ఫలితాలు పొందుతారు. వ్యాపారంలో పైరవీల బెడద ఇబ్బంది పెడుతుంది. సంతాన పురోగాభివృద్ధికి కృషి చేస్తారు. మీరు చేస్తున్న అన్ని విషయాలను గోప్యంగా ఉంచుతారు. రావలసిన  బాకీలు కొద్దికొద్దిగా జమచేసుకుంటారు. అసలు గురించే మీ ఆందోళన, వడ్డీల మీద ఆశపెట్టుకోరు. బంధువర్గం, దగ్గరివాళ్ళు, వయస్సులో పెద్దవాళ్ళు, సాయం చేయవలసిన పెద్దలే నవ్వుతూ ద్రోహం చేస్తారు, మీకు ప్రతికూలంగా మాట్లాడతారు. వ్యాపారాన్ని విస్తరిస్తారు, కొత్త బ్రాంచీలు విస్తరిస్తారు. మీ పేరు మీద ఇతులు చేసే వ్యాపారాలు మధ్యస్థంగా ఉంటాయి. అష్టమూలికా తైలంతో దీపారాధన చేయటం అన్నివిధాలా మంచిది. సంతానాన్ని అధిక గారాబం చేస్తున్నారన్న విమర్శలు వస్తాయి, వాటిని పట్టించుకోకండి.

---



## మీన రాశి *(ఆదాయం-11, వ్యయం-5, గౌరవం-2, అగౌరవం-4)*

ఈ రాశివారికి ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంది. ఆర్థిక విషయాల్లో పురోగతి సాధిస్తారు. రావలసిన ధనం చేతికి అందుతుంది. జీవితాశయం ఈ సంవత్సరం సాధిస్తారు. ఆరోగ్యపరంగా జాగ్రత్తలు అవసరం. సంతానపురోగతి బాగుంది. స్థిరాస్థులు కొనుగోలు చేస్తారు. విదేశీయాన సంబంధమైన విషయాలు అతికష్టం మీద సానుకూలపడతాయి. నూతన వాహనం కొనుగోలు చేస్తారు. పోటీ పరీక్షలలో విజయం సాధించి మంచి ఉద్యోగానికి ఎంపికవుతారు. దశమ స్థానంలో ఉన్న శని వల్ల వృత్తిఉద్యోగాలపరంగా మీ స్థానాన్ని బలపరుచుకుంటారు. ప్రతి విషయంలో పోటీ ఏర్పడినా అనుకూలమైన గురుగ్రహ ప్రభావం వల్ల విజయం సాధించగలుగుతారు. కుటుంబాన్ని ఆదుకోవాలనే మీ కోరిక నెరవేరుతుంది. సంవత్సర ప్రథమార్థం కన్నా ద్వితీయార్థం బాగుంది. రాహు-కేతువుల  వల్ల మీకు సంబంధంలేని సమస్యలు వచ్చిపడతాయి. శుభకార్యాలు కుదురుతాయి. వివాహసమస్య తీరిపోతుంది. శుభకార్యాలు ఘనంగా చేస్తారు. పునర్వివాహ సంబంధమైన విషయాలు కూడా సానుకూలపడతాయి. దిగులు, ఆందోళన తీరుతుంది.

ఈ రాశివారు సుబ్రహ్మణ్య పాశుపత హోమం చేయించుకోవడం వలన శుభఫలితాలు పొందుతారు. ''సమాజంలో ప్రతి విషయం ధనంతో ముడిపడి ఉన్నది '' అన్న సంగతి మీరు గ్రహించలేక నష్టపోతారు. ఆప్యాయతలు, పరిచయాలు, స్నేహాలు ఇవి ధనం ముందు పనిచేయవని తెలుసుకోలేక నష్టపోతారు. పూజలలో పరిమళగంధాన్ని ఉఫయోగించండి. మిమ్మల్ని దెబ్బతీయాలని చూసేశత్రువర్గాల ప్రయత్నాలు విఫలం అవుతాయి. ప్రతి విషయంలోనూ ఉన్నతాధికారులు, రాజకీయనాయకుల అండదండలు మీకు లభిస్తాయి. ఆత్మీయవర్గంతో కొద్దికాలం విభేదాలు కలుగుతాయి. సంతానానికి సంబంధించిన విషయాలలో ధనాన్ని అధికంగా ఖర్చు చేస్తారు. మానసికమైన ప్రశాంతత ఏర్పడుతుంది. మీ వైరివర్గాన్ని ఉపేక్షించకుండా సందర్భం వచ్చినప్పుడు ప్రతీకారం తీర్చుకుంటారు. పూర్తి మానవతా దృక్పథంతో, కారుణ్యంతో జీవించడం కష్టం అని గ్రహిస్తారు. సెల్‌ఫోన్ వాడకం ఎక్కువ అవుతుంది, మాటిమాటికి సెల్‌ఫోన్ మారుస్తూ ఉంటారు. మానసిక సంతోషాన్ని కలిగి ఉంటారు. నూతనమైన విద్యాకోర్సులు అభ్యసించాలన్న కోరిక నెరవేరుతుంది. కొంతమందికి సేవచేయడానికి, ఆదుకోవడానికి అవసరమైన అవకాశం లభిస్తుంది.

# వధూవరుల నక్షత్ర పొంతన

| | |
|---|---|
| అశ్విని, మఖ, మూల నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | భరణి, పుబ్బ, పూర్వాషాఢ, రోహిణి, హస్త, శ్రవణం, ఆరుద్ర, శతభిషం, పుష్యమి, జ్యేష్ఠ, అనూరాధ, ఉత్తరాభాద్ర, ఆశ్లేష, స్వాతి,రేవతి. |
| భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, మృగశిర, శ్రవణం, పునర్వసు, విశాఖ, అశ్విని, మూల, చిత్త, పూర్వాభాద్ర, ఆశ్లేష, రేవతి, మఖ, ధనిష్ఠ, పూర్వాషాఢ, జ్యేష్ఠ, శతభిషం. |
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | రోహిణి, శ్రవణం, హస్త, ఆరుద్ర, మూల, పుష్యమి, ఉత్తరాభాద్ర, మఖ, భరణి, పుబ్బ, అశ్విని, స్వాతి, శతభిషం, అనూరాధ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర. |
| రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | మృగశిర, చిత్త, ధనిష్ఠ, ఆశ్లేష, జ్యేష్ఠ, పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర, రోహిణి, పుబ్బ, రేవతి, పూర్వాషాఢ, భరణి ఉత్తర, ఉత్తరాషాఢ, కృత్తిక. |
| మృగశిర, చిత్త, ధనిష్ఠ నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | ఆరుద్ర, శతభిషం, స్వాతి, పుష్యమి, మూల, మఖ, అశ్విని, కృత్తిక, అనూరాధ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రోహిణి, ఉత్తరాషాఢ, ఉత్తర |
| ఆరుద్ర, స్వాతి, శతభిషం నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | పునర్వసు, విశాఖ, ధనిష్ఠ, పూర్వాభాద్ర, ఆరుద్ర, రేవతి, పుబ్బ, పూర్వాషాఢ,ఆశ్లేష, జ్యేష్ఠ, భరణి, హస్త, శ్రవణం, రోహిణి, చిత్త,  మృగశిర |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, మఖ, మూల, కృత్తిక, ఉత్తర, చిత్త, ఉత్తరాషాఢ, అశ్వని, శతభిషం, మృగశిర, ధనిష్ఠ, స్వాతి, ఆరుద్ర. |
| పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి, పుబ్బ, భరణి, హస్త, శ్రవణం, రోహిణి, స్వాతి, పుష్యమి, ఆరుద్ర, విశాఖ, పూర్వాభాద్ర, పునర్వసు, పూర్వాషాఢ, శతభిషం |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రాలకు పనికివచ్చు నక్షత్రాలు | మఖ, అశ్విని, కృత్తిక, ఉత్తర, మూల, ఉత్తరాషాఢ, చిత్త, ధనిష్ఠ, మృగశిర, విశాఖ, పూర్వాభాద్ర, పునర్వసు, అనూరాధ, పుష్యమి, ఉత్తరాభాద్ర. |

